# రేడియో

## బుధవారం, సెప్టెంబరు 1

### విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు వలె 8 ఆంగ్లమున వార్తలు.

మద్రాసు 1 (బి) వలె 1-30 (ఎ) వలె 1.40 హిందీ వా॥ 1-50 తెలుగున వార్తలు.

సా॥ 4 వి. లీల (రి) 5-30 ఎ. రామస్వామి (వ) 6 సంగీత శిక్షణ 6-15 ప్రాంతీయ వా॥ 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 గురుదక్షిణ (పురాణం) సమ్మంగి లక్ష్మీనారాయణశాస్త్రి 7-30 గానసుధ (రి) 7.45 ప్రసంగం (మద్రాసు రిలే) 8 మూడుముఖాలు (నాటిక) అనురేంద్ర 8-20 నేషనల్ ప్రోగ్రాం 8-50 (రి) 9 ఆంగ్లమున వా॥ 9-15 భజన్ (రి) 9.30 ఎ. రామస్వామి (వ) 10 ప్రసారసమాప్తి.

### మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా॥ 7-30 కాళహస్తి వీరయ్యవీణ 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 12-30 ఎన్. రాజమ్మాళ్ (వ) 1 మహిళామండలి (రి) 1-30 (రి) 1-40 హిందీలో వా॥ 1-50 (రి) 2 తమిళమున వా॥ 2-10 (బి) వలె.

సా॥ 4 (బి) వలె 4-20 పాశ్చాత్య సంగీతం (రి) 5-30 దేవకీరామచంద్రన్ 6 ఆంగ్లమున వా॥ 6-15 ప్రాంతీయ వా॥ 6-25 టి. వి. సౌందరరాజన్ 7 ప్రసంగం 7-15 తమిళమున వా॥ 7-30 జంత్రసమ్మేళనం 7-45 తిరుచి వలె 8 టి. ఎస్. వీరరాఘవన్ (వ) 8 30 నేషనల్ ప్రోగ్రాం 8-50 (బి) వలె 9 ఆంగ్లమున వా॥ 9-15 టి. సాంబమూర్తి (వేణువు) 9-45 (బి) వలె 19-30 ప్రసారసమాప్తి.

### మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 కృతి మణిమాల 7-30 (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 (ఎ) వలె 1 (రి) 1-30 ఆంగ్ల వా॥ 1-40 (రి) 1-50 తెలుగు వా॥ 2 నోటు వాద్యం 2-15 కిసుంతలా త్రిని వాసన.

సా॥ 4 ఎం. డి. పార్థసారథి 4-30 (ఎ) వలె 5-30 (ఎ) వలె 6-15 ప్రాంతీయ 6.25 లలితగీతం-జలప్రళయం-రచన: జిప్పలపల్లి కృష్ణశాస్త్రి 6-30 గ్రామ కార్యక్రమం 7 తెలుగు వా॥ 7-15 గురుదక్షిణ (పురాణం) 7-30 (ఎ) వలె 7-45 నీతి నియమం-క్రీస్తు. (ప్రసంగం) బి సోమసుందరరావు 8 మూడుముఖాలు (నాటిక) అనురేంద్ర. 8-30 కమల, విమల 9 (ఎ) వలె 9-45 గానలహరి 10-30 ప్రసారసమాప్తి.

### హైదరాబాదు

ఉ॥6-55 సుప్రభాత 7 తెలుగు వా॥ 7-15 పర్వతనేని వీరయ్యచౌదరి 7-45 గీత 8 ఆంగ్ల వా॥ 8-15 హిందీ వా॥ 8 30 ఖయాల్ 8-45 గీత్.

మ॥ 12-30 (రి) 12-50 మరాఠీ వా॥ 1 వాద్యసంగీత (రి) 1-10 (రి) 1-50 తెలుగు వా॥ 2 విద్యార్థుల కార్యక్రమం.

సా॥ 5-30 ఖయాల్ 5.45 గీత, ఘజల్ 6 కన్నడ కార్యక్రమం 6.30 టి. ఆర్. మహాలింగం. వేణువు (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ అన్నయ మంత్రి-(బుర్రకథ) 7 తెలుగు వా॥ 7-15 గ్రామసీమ 7-45 కన్నడ వా॥ 8 మూడు ముఖాలు (నాటిక) 8-30 నేషనల్ ప్రోగ్రాం 8-50 పంఢరినాథ-తిబ్లా. 9 ఆంగ్ల వా॥ 9-15 ఉర్దూ వా॥ 9-30 పర్వతనేని వీరయ్యచౌదరి 10-30 ప్రసారసమాప్తి.





(శ్రీకాకుళం ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలో ఆగస్టు 25 వ తేదీన శ్రీ వి. వి. లింగరాజుగారు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వైస్ ఛాన్సలర్ వి. ఎస్. కృష్ణగారు ప్రారంభించినప్పటి ఫోటో.)

రామచంద్రపురం తాలూకా చెల్లూరు సహకార మార్కెటింగు సంఘ గిడ్డంగికి ఆగస్టు 23 వ తేదీన జిల్లా కలెక్టర్ సాంబమూర్తిగారు శంకుస్థాపన చేసిన సందర్భంలో తీసిన ఫోటో.

# మనపాఠశాలల్లో ఉత్తమ సంప్రదాయాలుఏర్పడాలి

## చిత్తూరు బోర్డుహైస్కూలు శతవార్షిక ఉత్సవాలు ప్రారంభిస్తూ శ్రీ త్రివేదీ అధిభాషణ

చిత్తూరు, ఆగస్టు 29: "విద్యాసంస్థలు క్రమేపీ వృద్ధిపొందడం, అనుభవం గడించడం గొప్ప విషయం. నేటి స్కూలు విద్యార్థులు ఉన్నతి సాంప్రదాయాలకు వారసులు. ఈటన్, రగ్బీ హారో పాఠశాలలు నెలకొల్పిన భారతీయ పాఠశాలలుకూడ సత్ సాంప్రదాయాలు కొనసాగించే ఆకాంక్ష విద్యార్థులు పెంపొందించుకోవాలి" అని గవర్నరు శ్రీ త్రివేదీ నేడు బోర్డు హైస్కూలు శతవార్షికోత్సవాలు ప్రారంభిస్తూ ఉద్బోధించారు. శ్రీ సి. బాలగురునాథన్ స్వాగతమిస్తూ ఆంధ్రలో శతవార్షికోత్సవం జరుపుకునే మాధ్యమిక పాఠశాలల్లో యిదే మొదటిదని, అందుకు తాము గర్విస్తున్నామని అన్నారు. పిదప స్కూలు చరిత్ర వివరించారు. శ్రీ పి. భావ్యం అయ్యంగారు, పి. టి. పార్థసారథిముదలియారు గారు ప్రధానోపాధ్యాయులుగా నున్నపుడు ఈ స్కూలు ఎంతో పైకి వచ్చినదనీ, జిల్లాబోర్డునుంచి 1919 లో ప్రభుత్వం ఈ పాఠశాలను స్వాధీనపరచుకుని 1925 లో తిరిగి యిచ్చివేసిందనీ శ్రీ బి. మునుస్వామినాయుడు టి. వి. రఘునాథరెడ్డిగార్ల (అధ్యక్షులు) కృషివలన యీ సంస్థ ఆదర్శనీయంగా వర్ధిల్లిందనీ పేర్కొన్నారు. విద్యా విషయంలో చిత్తూరు అవసరాలు వివరిస్తూ ఇచట ఒక ఫస్ట్ గ్రేడ్ ప్రభుత్వ కళాశాల ప్రారంభించాలనీ కోరారు.

శ్రీ త్రివేదీ సమాధానమిస్తూ యిలా అన్నారు.

"ఒక సంస్థ తన క్రమాభివృద్ధిలో అనుభవం గడిస్తుంది. యిది ఆ సంస్థకు గొప్ప విషయం. నేటివి ద్యార్థులు ఉన్నతి సాంప్రదాయాలకు వారసులు. ఈటన్, రగ్బీ వంటి ఇంగ్లీషు పాఠశాలలను నెలకొల్పిన విధంగానే సత్ సాంప్రదాయాలను భారతీయ పాఠశాలలు నెలకొల్పాలన్న ఆకాంక్షను విద్యార్థులు పెంపొందించుకోవాలి.

ప్రధానోపాధ్యాయుల పేర్లను మీరు చెప్పారు. వారందరికీ మా అభినందనలు తెలుపుకోవలసినదే. ఒక ప్రధానోపాధ్యాయుని "పెద్దపులి" అని పిలవడం గొప్పవిషయమే అయినా అంత బాగుండదు. "పెద్దపులి" కూడా పిరూ డ్రిన్స్వడియా జీవిగా అని అన్నాను.

ఉన్నత శ్రేణికి చెందిన మేధావులను తయారు చేయడమే పాఠశాల ప్రధాన లక్ష్యం కారాదు. వారుకూడా అవసరమే, కాని మంచి సామాన్య పౌరులను కూడా తయారు చేయాలి. జీవితంలోని వివిధ రంగాల్లో తగిన నాయకులను తయారుచేయాలి. అనేక విషయాలు నేర్చుకొని ఉపయోగకరమైన పౌరులుగా రూపొంది ఆ పాఠశాల అభివృద్ధి సాధించ చేయాలి."

ఆనంతరం విద్యాశాఖాధికారి ప్రసన్న సన్యాసిరావుగారు ప్రారంభోపన్యాసం చేశారు. శ్రీ బాలగురునాథన్ గారు ప్రధానోపాధ్యాయులు శ్రీ యం. సి. శేషాచలం ప్రభృతుల సహాయంతో యీ ప్రదర్శనల యేర్పాటును గావించిందని తెలియజేశారు. నేటి లో గ్రాస్పిత్రి మందులు, ఎలెక్ట్రిక్ మోటారు, ఇంద్రధనుస్సు అవతరణ, మున్నగునవి యీ ప్రదర్శనలో ముఖ్యమైన ఆకర్షణలు. ఇంకా జాతీయ కెడెట్ దళం వ్యాయామ ప్రదర్శనల చిత్రాలు మున్నగునవి చూపబడినవి.

### భక్తరామదాసు నాటక ప్రదర్శనలు

మదరాసు, ఆగస్టు 29: నవాబ్ రాజమాణిక్యం నటించిన భక్తరామదాస్ అను నాటకము "ది స్టేజ్" యాజమాన్యమున ప్రదర్శించడం నిన్నటినుండి తేనాంపేట కాంగ్రెస్ ఆవరణలో ప్రారంభమైనది. ఈ నాటక ప్రదర్శనమునకు మదరాసు ఆర్థికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించారు.

నాటకమున రామదాస్, తానీషాల పాత్ర పోషణ చక్కగా నుండినది. రంగస్థలములో సీనులు సెట్టింగులు ముఖ్యంగా తానీషాదర్బారు, భద్రాచలం శ్రీరాములవారి ఆలయం సీను బహుపాండిత్యంగా అమర్చబడి నాటకము ఆకర్షణీయముగా చేయబడినది.

నాటకం పూర్తిఅయినమీదట ఆర్థిక మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారు నవాబ్ రాజమాణిక్యం కంపెనీవారు నాటకమును బహు చక్కగా ప్రదర్శించినందుకు ప్రశంసించారు.

### ప్రకాశం పంతులుగారి జన్మదినోత్సవం

మదరాసు, ఆగస్టు 28: త్యాగరాయనగరు ఆది ఆంధ్ర సేవాసంఘము గల 26 వ తేదీ సాయంత్రము ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులుగారి జన్మదినోత్సవం వైభవంగా జరిపారు. శ్రీ యం. ఆర్. తిలక్ గారు సభకు అధ్యక్షత వహించారు.

శ్రీ కె. వి. సుబ్బారావుగారు ఆంధ్రకేసరి చరిత్రను వివరిస్తూ సైమన్ కమిషన్ రాక సమయమున ఆయన చూపిన ధైర్యసాహసమును వివరించారు ఆంధ్రకేసరి యిలాగు నూరేళ్లు జీవించి ఆంధ్రప్రజలకు నాయకులై వెలుగొందాలని మదరాసును చీఫ్ కమీషనరు రాష్ట్రంగా చేయుటానికి విశాలాంధ్రను హైదరాబాదు ముఖ్యపట్టణంగా స్థాపించుటకు శ్రద్ధవహించాలని కోరారు.

అధ్యక్షులు శ్రీ తిలక్ గారు శ్రీ ప్రకాశంగారివంటి ధైర్యశాలి లేరంటూ స్వాతంత్ర్య పోరాటంలో ఆయన త్యాగం అనన్యమైనదని పంతులుగారు ఆంధ్ర రాష్ట్రానికి ... ప్రజల సేవకై ... ఉంటారన్నారు.

బాలబాలికల జనగణమన గీతంతో సభ ముగిసినది.

### త్యాగరాయనగరు మహిళా సభ

మదరాసు, ఆగస్టు 28: త్యాగరాయనగరు మహిళాసభ ప్రథమ వార్షికోత్సవం మొన్న 26 వ తేదీన దక్షిణ భారత హిందీ ప్రచారసభ కళామండపములో జరిగినది మిసెస్ ఇడా షేంబర్స్ గారు అధ్యక్షత వహించారు.

మిసెస్ సత్యశ్రీనివాసన్ గారు సభ్యురాండ్రకు స్వాగతమొసగుచూ అధ్యక్షురాలిని, ఉపన్యాసకురాలిని సభవారికి ఎరుకపరచారు.

శ్రీమతి పి. శకుంతలమ్మగారు వార్షిక నివేదికను చదివారు.

మాజీ మద్యనిషేధమంత్రి శ్రీమతి జ్యోతి వెంకటాచలంగారు ప్రసంగిస్తూ యిలాంటి మహిళాసంఘాలు ఉండడం చాలా అవశ్యకమనీ సభ్యురాండ్రు హీనదశలోనుండే స్త్రీల సముద్ధరణకు సహాయ్యపడుతూ ఉండాలనీ విన్నవించారు.

సభాధ్యక్షురాలు శ్రీమతి బి. డి. వి. రామస్వామి నాయుడుగారు తమ సంఘంవారు త్వరలో స్థాపించ నుద్దేశించియున్న శరణాలయానికి ప్రజలు ఉదారముగా విరాళాలివ్వాలనీ, విరాళాల సేకరణకై ఆక్టోబరు మూడు లేదా నాల్గవవారంలో సినిమా నటుల క్రికెట్ పోటీ ఒకదానిని ఏర్పాటు చేయబడుతుందని చెప్పారు.

ఇడా షేంబర్స్ గారు సంఘము నిర్వహిస్తున్న పనులను విశేషంగా ప్రశంసిస్తూ తాము సర్వవిధముల సహాయ్యపడెదమని వాగ్దానం చేశారు.

త్యాగరాయనగరు బాలానంద సంఘం సభ్యుల నృత్యసంగీత ప్రదర్శనము జరిగింది.

మిసెస్ ఎ లక్ష్మమ్మగారు వందనార్పణముతో కార్యక్రమము ముగిసినది.

# క్రీడారంగం

## యూరపియన్ అథలు పోటీలు

### 1500 మీటర్ల పోటీలో బానిస్టర్ విజయం

జెనీవా, ఆగస్టు 29: యూరపియన్ ఛాంపియన్ షిప్ కై జరిగిన 1500 మీటర్ల ఫైనల్సుపోటీలో రాజర్ బానిస్టర్ (బ్రిటన్) ప్రథమునిగా వచ్చాడు. ఈ దూరాన్ని అతను 3 నిమిషాల 43 8 సెకండ్లలో పరుగెత్తాడు. డెన్మార్కు ఆటగాడు నైల్సన్ ఈ పోటీలో ద్వితీయునిగా వచ్చాడు.

5 వేల మీటర్ల పోటీలో కూట్స్ (రష్యా) ప్రథముడుగానూ, సి. ఛాటవే (బ్రిటన్) ద్వితీయుడుగానూ, ఎమిల్ జటోపెక్ (జెకోస్లావేకియా) తృతీయుడుగానూ వచ్చారు.

నేడు జరిగిన ఏడు ఫైనల్సు పోటీలలోనూ హంగరీ మూడింటిలో—3 వేల మీటర్ల స్టీపుల్ ఛేజ్, 8 వేల మీటర్ల వాక్, లాంగ్ జంప్—విజయం సంపాదించింది.

నేటి ఆటల పోటీలకు 20 వేల మంది ప్రేక్షకులు వచ్చారు.

## గుంటూరులో టేబుల్ టెన్నిస్ టూర్నమెంటు

### సెప్టెంబరు 2 నుండి 5 వరకు

గుంటూరు, ఆగస్టు 29: గుంటూరులో ఓపెన్ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్ షిప్ టోర్నమెంటు జరపడానికి గుంటూరు రిక్రియేషన్ క్లబ్ వారు నిశ్చయించారు. ఆంధ్రా టేబుల్ టెన్నిస్ అసోసియేషనుకు ఇది అనుబంధించబడుతుంది. సెప్టెంబరు 2 వ తేదీ నుండి 5 వ తేదీవరకూ మెన్స్ సింగిల్, డబుల్స్, వానిమెడలిస్ట్ సింగిల్, డబుల్స్ పోటీలు జరుగుతాయి. ఇవికాక పిల్లల సింగిల్స్ (16 సం॥లోపు వారికి) టోర్నమెంటుకూడా జరుపబడుతుంది. (స్వ. వి.)

## నెల్లూరు పోలీసు, ఫైర్ సర్వీస్ శాఖలపోటీలు

### నెల్లూరు టౌన్ సర్కిల్ కి ఛాంపియన్ షిప్

నెల్లూరు, ఆగస్టు 28. నెల్లూరు జిల్లా పోలీసు, ఫైర్ సర్వీసుశాఖల వార్షిక ఆటలపోటీలు 21 వ తేదీన నెల్లూరు పెరేడ్ గ్రౌండ్స్ లో జరిగాయి జిల్లా కలెక్టరు కె. వి. మాదప్పగారు అధ్యక్షత వహించారు. ఆయన సతీమణి బహుమతులు పంచారు.

ఈ క్రీడోత్సవాలలో ఛాంపియన్ షిప్పు నెల్లూరు టౌన్ సర్కిల్ కి లభించింది. రిజర్వుపోలీసు ఛాంపియన్ షిప్ నెల్లూరు సాయుధ రిజర్వుకు చెందిన ఒకటవ రెండవ ప్లాటూన్లకులభించింది.

ఆటల పోటీలలో యీ క్రిందివారు ప్రథమ బహుమతు లందుకున్నారు.

100 మీటరు — పి. సి. 26 6. 15 వందల మీటర్లు—(అందరికీ) గియాజ్ ఉద్దీన్ హర్డిల్ రేసు— పి. సి. 198 5. మారథాన్—సి పి. 9 10 జింఖానా పోటి నటరాజన్ (డి. టి. ఎస్.) మిసెస్ కె. ఎస్. మాదప్పగారికి సు (బహుమతులు) జార్జి.

మ్యూజికల్ చైరు (బాలురకు)— వీరాస్వామి, బాలికలకు—ప్రేమ.

100 మీటర్ల హ్యాండికాప్ మొహిదీన్.

400 మీటర్ల రిలే— సాయుధ రిజర్వు ఒకటవ ప్లాటూన్ 400 మీటర రిలే (తాలూకా) నెల్లూర్ పట్టణ సర్కిల్.

షూటింగ్ — (సా. రి.) మూడవ ప్లాటూన్ (తాలూకా) నెల్లూర్ పట్టణ సర్కిల్.

టగ్ ఆఫ్ వార్: (సా. రి.) ఒకటవ ప్లాటూన్, (తాలూకా) నెల్లూరు పట్టణ సర్కిల్.

లాంగ్ జంప్ — పి. సి. 2183

షాట్ పుటింగ్ — ఎస్. ఐ ప్రభాకరరావు హైజంప్—పి. సి. 358.

డిస్కస్ త్రో—ఎస్. ఐ ప్రభాకరరావు పోల్ వాల్టు — పి. సి. 1985.

జావలిన్—ఎస్. కె 1357.

హేమర్ త్రో—ఎస్. కె. 1357.

హాప్ స్టెప్ అండ్ జంప్— పి. సి. 358

200 మీటర్ల రేసు— పి. సి. 520.

400 మీటర్లు—పి. సి. 2865.

800 మీటర్లు—పి. సి. 483.

10 వేల మీటర్లు—

ప్రథమునకు—పి. సి 2325;

ద్వితీయునకు పి. సి. 2449;

తృతీయునకు—పి. సి. 1319.

## నెహ్రూ విదేశాంగవిధానం 'అమూల్యం'

### డి. ఎన్. ప్రిట్ ప్రశంస

కలకత్తా, ఆగస్టు 29: పరాయి దేశాలలో భారతదేశ ప్రతిష్ఠను ఇనుమడింపజేసినది ప్రపంచ శాంతి సాధనలక్ష్యంతో ప్రధాని నెహ్రూ అనుసరిస్తున్న అమూల్యమైన విదేశాంగ విధానమూ, దేశంలో న్యాయపాలనా శాఖ గడించుకొన్న గౌరవమునని ప్రసిద్ధ బ్రిటిషు బారిష్టర్ డి. ఎన్. ప్రిట్ అన్నారు.

నెహ్రూ చౌ ఎన్ లై ప్రకటన ప్రపంచ శాంతికి చాలా ప్రోత్సాహమిచ్చిందన్నారు. సీటో సమావేశానికి తాను వ్యతిరేకులమంటూ భారతదేశం వహించిన వైఖరివల్ల ఆ సమావేశం ఉత్తేజాన్ని స్థాయికి దిగజారిపోయిందన్నారు.

# మదరాసు ధరలు

మదరాసు, ఆగస్టు 30:

బంగారు-వెండి పేట మధ్యాహ్నం

| | | |
|---|---|---|
| 1 గంటకు వరకు 1-కి ఎన్వర్గుబొమ్మ పేల్సుటాప్సుతో సహా | రు. | 58 12 0 |
| పెట్టాబంగారం తులం | రు. | 89 2 0 |
| మూస బంగారు | రు. | 88 0 0 |
| సీమవెండి తులం100కి రెడి | రు. | 157-0-0 |
| చిల్లర ధర | రు. | 1-10 0 |

### వేరుశెనగ

(531 పా॥ 1-కి ఎక్సుపోస్టు సిద్ధంగల మెషిన్-పేల్సుటాప్సుతో సహా) రు. 110-112-0-0

| | | |
|---|---|---|
| వేరుశెనగనూనె ఎక్సు పిల్లర్ డిలో 8% (500పా.) రెడి చిల్లరధర | రు. | 228-0-0 |
| టెంకాయనూనె (37½ పౌనులు) | | |
| అంబుమార్కు | రు. | 81-4-1 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | | 30-8-9 |
| రాజా | రు. | 29-12-9 |

### ఆముదం

తిరుపత్తూరు (500 పా) రు. 200-0-0

### పంచదార

| | | |
|---|---|---|
| జపాన్ | (66 పా) | 24-8-9 |
| జర్మనీ | (223 పా) | 88-0-9 |
| పోలిష్ | (223 పా) | 83-4-9 |
| క్యూబా | (100 పా॥) | 86-8-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, ఆగస్టు 30: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 154-1-0 |
| బంగారం (1 తు.) | 87-10-0 |
| సావరిన్ | 58 0-0 |

కలకత్తా మార్కెట్ ధరలు: 154-14-0 87 2.0; 57.14-0.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras.